LAKSHMI VILAS

TELUGU

READING BOOKS.



# SEETADEVI.



by

N. Chalapati Rau.

Grade III.





శ్రీరస్తు.

శ్రీపరమాత్మనే నమః

# సీతాదేవి



మిథిలానగరము విదేహరాజ్యమునకు రాజధాని. అధిక క్షాత్రతేజుఁడగు నిమి దీని ప్రథమపాలకుఁడు. ఆవంశ్యులలోఁ బవిత్రుఁడు జనకమహారా జిప్పుడు దానినిఁ బరిపాలించుచున్నాఁడు. ఆతఁడు సూర్యశిష్యుఁడగు యాజ్ఞవల్క్యునికడ బ్రహ్మజ్ఞానమును గాంచిన కర్మయోగి. పుణ్యచారిత్రులగు గౌతమ శతానంద విశ్వామిత్ర ప్రభృతుల సాంగత్యమున కర్మయందకర్మనెఱిఁగిన పుణ్యశీలుఁడు. ఆతఁ డిప్పుడొక మహాక్రతువును జేయఁదలపెట్టి యున్నాఁడు. అధ్వర్యుఁడు, ఉద్గాతృఁడు, హోతృఁడు నిమంత్రితులైరి. మఖభూమియందు పందిళ్లు పాకలు నిర్మింపఁబడుచుండెను. నిరంతరాన్నప్రదానమునకు, హవిస్సులుగా వేల్చుటకు వస్తుజాలము సమకూర్పఁబడుచుండెను. ఋషిబృందములు, రాజబంధువులు, విదేశప్రేక్షకులు తండోపతండములుగా వచ్చుచుండిరి. బలసిన ఋషభములను బూన్చి, యజ్ఞభూమిని సుముహూర్తమున దున్నుట కుపక్రమించిరి. భూమిఁ జించుకొని మెఱుపుదీఁగవలె కన్యారత్నము పైకి వచ్చెను. జ్ఞానులు దివ్యదృష్టిఁ జూచి యవతారమెత్తిన కమల యీ

మె యని కనుఁగొనిరి. యజ్ఞదీక్షయందుఁ బ్రవేశింపఁబోవుచున్న జనకున కీయజ్ఞభూమిసముద్భవ నొసంగిరి. ఈయనర్ఘ్యమణిని, దివ్యకాంతివిలసితను, ఈతటిత్పుంజమును, ఈయయోనిజను, ఈ మహాసాధ్విని, ఈలోకపావనచరిత్రను, ఆబ్రహ్మజ్ఞాని, ఆకర్మయోగి, ఆమహాధీరుఁడు, ఆయుదారభావుఁడు, యజ్ఞప్రసాదముగా, తపఃఫలముగా, జన్మతారకముగా, పరిగ్రహించెను. ఆభూమికన్యకు సీత యని పేరిడిరి. లోకమాతయని మదిఁ దలఁచిరి. జనకుల జ్యేష్ఠపత్ని యీకన్యారత్నమును మాతగా బెంచెను. యజ్ఞము భూరిదక్షిణలతో, ఆర్యగానముతో, హోమధూమముతో, ఇంద్రాదిసురస్వీకృత హవిర్భాగములతో జనకానందముగా పరిసమాప్తి నొందెను. సీత, రూపెత్తిన జ్ఞానరాశియో యనఁ బరమతాత్త్వికుఁ డగు జనకునిమ్రోల, నల్లారుముద్దుగా వర్ధిల్లుచుండెను. జనకున కామె ముద్దుపలుకులు, వ్యక్తముగాని వేదవాక్కులవలెనుండెను. ఆమె చూపు ముముక్షువులకజ్ఞానతిమిర భాస్కరములవలె నుండెను. ఆలలిత చప్పటడుగుల ధ్వని వేదఘన జటలను మనసులోఁ బలికించుచుండెను. రానురాను జనకున కామె జ్ఞానదీపమువలె నుపచరించుచుండెను. ఇతరుల కామె పవిత్రమూర్తి యారాధనీయముగా నుండెను. జనకుఁ డార్యశిష్టాచారసంపన్నుఁడు. మనోవాక్శుద్ధములగు కర్మలను నిరంతరము బ్రహ్మార్పణముగావించు కర్మఠుఁడు. సీతాదేవి జనకునకుఁ బురోహితశిష్యునివలె పూజాద్రవ్యముల సమకూర్చుచుండును. జనకుఁడు శివధనుస్సును బూజించునప్పుడు దగ్గరఁ గూర్చుండును. అతఁడు బ్రహ్మపారాయణమును జేయునపుడు విద్యార్థినివలె నెదుటఁ గూరుచుండును. ఋషులు, మునులు, అతిథులు, అభ్యాగతులు వచ్చినప్పుడు వారి సపర్యలను సల్పుచుండును. వారి

సద్గోష్ఠి వినుచుండును. జనకుని యగ్నిగృహ మామె యధీనమం దున్నదన నతిశయోక్తి కాదు.

సీత వయస్సుకంటె జ్ఞానసంపద యేపుగా నెదుగుచుండెను. వయస్సు కాలబద్ధమై యామె జ్ఞానవేగముతోఁ బరుగెత్త లేకపోయెను. కాలమును నియతగతిచే జరిగెను. జ్ఞానోపాధికమగు సీతాశరీరము పరివృద్ధమయ్యెను. క్రమముగా నాసన్నవయస్కయాయెను. జనకు లెఱుఁగరు. ఒకనాఁడు సీత శివధనుస్సున్న అగ్నిగృహము సమార్జన మొనర్చెను. శివధనుస్సు యథాస్థలమున లేదు. జనకులు యథాక్రమముగాఁ బూజకు వచ్చిరి. శివధనుస్సును వీక్షించిరి. ఇది యెట్లున్న దేమని ప్రశ్నించిరి. సీత ముద్దుమాటలతో "ఇల్లలుకునప్పుడు నేనే యచ్చట పెట్టితి" నని కుడిచేతితో నెత్తి, మరల యథాస్థానమునఁ బెట్టెను. జ్ఞానసముద్రులగు జనకు లిదిచూచి సంబరపడి తమ్ముఁడు కుశధ్వజునితోఁ జెప్పిరి.

సీతాదేవి వయస్వతి యగుచున్నది. కన్యారత్న మెప్పుడైన నొకరిచేతులోఁ బెట్టఁబడవలసినదే గదా. నిమివంశకీర్తిప్రతిష్ఠలకుఁ దగిన వంశముతో సంబంధము చేయవలయును. క్షాత్రవంతుఁడు, అనురూపవయోగుణవంతుఁ డగుపురుషుఁడు కావలయునని పరిపరివిధముల జనకులు తలంచిరి. శివధనుస్సు నవలీలగా నెత్తు నీమెకు, శివధనుస్సు నెక్కుపెట్టఁగలవాఁడే పతి యని యనుకొనిరి. సీతపెండ్లికి శివధనుస్సు నెత్తుటయే పణమనిరి. ఈవార్త దిగ్దేశములు వ్యాపించెను. జనకులు వైదికాచారసంపత్తిగలవా రగుటచే ఋషికుటీరములయం దీవార్తకుఁ బ్రచార మెక్కువ గలిగెను.

ఆర్యక్షత్రియులలో పరాక్రమవంతుఁడు విశ్వామిత్రుఁడు.

ఆతఁడు సంపదలను బాసి రాజర్షియై దండకారణ్యమునఁ దపోదీక్షచే వెలిఁగిపోవుచున్నాఁడు. ఆనాఁడు దండకారణ్యము రాక్షసకులసంకులమై, రావణశాసనబద్ధమై, తపోధికుల శాంతికి భంగకరమై యుండెను. విశ్వామిత్రుఁడు దండకాటవినిఁ దాపసనివాసయోగ్యము కావించుటకై, కోసలదేశప్రభు పుత్త్రులును, అధికక్షాత్త్రవంతులును, తేజోవీర్యులగు శ్రీరామలక్ష్మణులను దన యాశ్రమమున నుంచికొని వారికి దివ్యాస్త్రముల నుపదేశించి రాక్షసహననమునకు సన్నద్ధులను గావించెను. సీతావివాహపణప్రశంస విశ్వామిత్రుని చెవిసోఁకెను. విశ్వామిత్రుఁ డిటు రఘుకులమునకు నటు నిమికులమునకుఁ గావలసినవాఁడు. శ్రీరామలక్ష్మణులను వెంట నిడుకొని మిథిలానగరము ప్రవేశించెను.

వేదాంతవేది జనకు పరిపాలనముచేతనే దిగంతకీర్తివిలసితమైన మిథిలానగరము, సీతానివాసముచే మఱింత యశఃప్రభాపటలీవిహసితమై చెలువారుచుండెను.

విశ్వామిత్రుఁడు రాజపుత్త్రులతో రాఁగానే జనకులు వారిని యథోచితవిధమునఁ బూజించి యాతనితోఁ జనుదెంచిన క్షత్త్రియబ్రహ్మచారులకుఁ దగిన యాసనము లిచ్చెను. వారిక్ష్వాకుకులవిస్తారకులని విననతోడనే యాతని ముఖపద్మము వికసించెను. కుశధ్వజుఁడు వారిలోఁ బెద్దవానికి శివధనురారోపణపణము లేకుండిన నప్పుడే సీతనిచ్చి పెండ్లిఁ జేసిన ననుకూలము గానుండు ననుకొనెను. విశ్వామిత్రుఁడు వారికి శివధనుస్సును జూపి, యిదియే, జనకులు సీతావరణమునకుఁ బణముగానుంచినది. అనఁగానే శ్రీరామచంద్రుఁడు చూపునిగుడ్చెను. సీతాదర్శనముచేఁ బవిత్రీభూతులగుటకై యేతెంచిన నానాదేశాగత మహీతలనేతల పుత్త్రు లక్కడనే యుండిరి. శతానంద గౌత

చూపరు లచ్చటనే యుండిరి. కుశధ్వజాదిరాజబంధువు లుండిరి. సీత, ఊర్మిళలు చూచుచుండిరి. శ్రీరాముఁడు శివధనుస్సు నెత్తెను. ఎక్కుపెట్టుటకై నారిసారించెను. సీతామానస మాపవిత్రమూర్తి నెన్నంటియుండెను. ధనుస్సు ఫెళ్లున విరిగెను. సీతావదనము వికసించెను. తప్పుపాటుతో లజ్జ యావరించెను. జనకులు సభ్యు లానందమున నుండిరి. దశరథు లీవార్త వినఁగానే సకలబంధుజనపరివారముతో వివాహసుముహూర్తమునకు విచ్చేసిరి. దేవతలు దుందుభులు మ్రోగించిరి. వసిష్ఠులు మంగళాశీర్వచనపురస్సరముగా శ్రీరామునిచే సీత మెడను పుస్తెఁ గట్టించిరి. సకలజనులకు మృష్టాన్నము. పురమంతట సంబరము. సీతాదేవిని శ్రీరామునితో, అత్తవారింటి కయోధ్యకుఁ బంపుచు ఋషిసత్తము లుభయకుల పవిత్రపుకన్యవని యాశీర్వదించిరి. జనకులతోపాటు మిథిలానగరవాసులును సీతావియోగము నసహమనిరి.

అర్థనారీశ్వరియై శివు నలరించి, హృదయవాసినియై విష్ణునికిఁ బ్రీతిఁగొల్పి, శ్రీరాముని సహవాసినియై, పృథక్ఛరీరముతో మానవైక్యమును లోకులకుఁ జూపుట కవతరించిన యాదిశక్తి యీ సీతయని కవులు వాస్తవము నుత్ప్రేక్షించిరి. సీతారాములయోధ్యానగరము చేరిరి.

దశరథుని ముగ్గురుభార్యలలోఁ గౌసల్యాదేవియే శ్రీరామునిఁ గన్నతల్లియైనను, కైక, సుమిత్రలుకూడ భేదభావము లేక తల్లులవలెనే యుండిరి. సీతయు వారియందు నేకభావమునఁ జూచుచు, వారి యనుభవవాక్యముల శిరమునఁ బూనుచు, రాజోచితవిధమున సకలసంపదల ననుభవించుచుండెను. ఆదివర కేదియో చెప్పఁగారాని కొంత యుష్ణమల్లను, సీతాప్రవేశముచే

నాకొఱంత గిరినట్లు నయోధ్యాపురము సంపూర్ణకళలఁ జెలంగుచుండెను.

హిందూగృహమునకు గోడలు నూతనాలంకారము. ఇక్ష్వాకువంశము ధర్మశాస్త్రమునకు వినియోగభూమి. అత్తమామలు సీతను బుత్త్రికగా నెంచుదురు. లక్ష్మణభరతశత్రుఘ్నులు మఱదులు. వా రామెను మాతృభావమునఁ బూజింతురు. సీతాదేవికి మిథిలాయోధ్యలును, జనకదశరథులు నొక్కరీతిగానే గానుపించిరి. అందఱికిఁ దలలోని నాల్కవలె సీత మెలఁగుచుండెను.

దశరథుఁడు శ్రీరామునిపై రాజ్యభారమునుబెట్టి యిక్ష్వాకువంశ్యులకుఁ బెద్దతనమున కలంకారమైన వానప్రస్థమును జేయుటకు సంకల్పించెను. గురు వసిష్ఠులయానతి శ్రీరామపట్టాభిషేకమునకు సుముహూర్తము నిశ్చయింపఁబడెను. లక్ష్మణుఁడు పట్టాభిషేకసన్నాహమున నతికుతూహలుఁడై యున్నాఁడు. భరతశత్రుఘ్నులు రాజబంధువులఁ బిలువఁ బోయియున్నారు. సీతాదేవి పట్టమహిషియగునని పురజనులు సంతసించుచు, కాన్కలను సిద్ధపఱచుచున్నారు. మందర కైక అరణపుదాసి ఆమె కైకతో నన్నదిగదా " వెఱ్ఱిదానా—రాఁబచ్చిన వరము లిప్పుడే అడుగు. శ్రీరామునికి పట్టాభిషేకమైతే, నీకొడుకునకు రాజ్యమెట్లు వచ్చును. నీవు రాజమాత వెట్లగుదువు—లే అడుగు వరములు—రెండు వరములు. భరతుని పట్టాభిషేక మొకటి బాగా జ్ఞాపక ముంచుకో—సీతారాములు 14 సంవత్సరములు అరణ్యవాసము—రెండు. లే—పదునాలుగు దాటితే స్వత్వమేపోవును."

కైక, సంకోచించినది. శ్రీరాముని బిడ్డగాఁ బ్రేమించు

చున్నదిగదా. తాటకాసురసంహారముచేతను, శివధనుర్భంగపరిశ స్తిచేతను, సహజకోమలతచేతను, శ్రీరాముఁ డందఱకుఁ బ్రీతి పాత్రముగా నున్నాఁడుగదా. కైక సంకోచించినది; మందర యొప్పుకోలేదు. లే లెమ్మన్నది. ఆలోచింపనీయలేదు. బోఁగా ముల కెడము లేదు దశరథునిసన్నిధిఁ జేర్చినది.

కైక చివర కనవలసినమాట యన్నది. దశరథుఁడు మూర్ఛిల్లినాఁడు. దైవదుర్విపాకమునకు దుఃఖించినాఁడు. పుత్త్రిపేమమే చాలును. అటుపైని నార్యక్షత్రియుల కలంకారమైన యుచితశౌర్యము. అన్నిఁటికిఁ దలకట్టు ఆతని పితృభక్తి.

శ్రీరాముఁ డెట్లో యిది విన్నాఁడు. తండ్రిదగ్గరకువచ్చి రఘువంశజులు సత్యముతప్పరని చెప్పి, పిత్రానతిఁ గొని వనప్రదేశములకు నడుముఁగట్టినాఁడు. సీతాదేవి, శ్రీరాముని నీడ, ఆమెకు శ్రీరాముఁడే సమస్తమును. పతితో వనవాసమునకు బయలుదేరినది.

శ్రీరాముఁ డాకోమలాంగి కరణ్యవాసమునఁ గలుగు కష్టములను జెప్పెను. ఇంట నుండుమని చెప్పెను. రావలదని చెప్పెను. సీత యేమనుచున్నది. నాకు మీతో నుండుటయే పరమసౌఖ్యము. పత్నియే పతిభాగ్యమును జూఱఁగొనవలసినది. భర్తయే భార్యకు నేడుగడ. మీరే నాస్వర్గము. నాభాగ్యము. నాసర్వము. నన్ను వెంటఁగొనిపోకుండఁ బాయునంతటి యపరాధమేమిచేసితిని? మీమాట జవదాఁటుదానను గాను. బ్రహ్మచర్యవ్రతము పూని మీపదాబ్జములఁ గొలుచుచుండెదను. యీవల్లోకమును సంరక్షింపఁగల మీకు నేనా భారము? పగమతేజోమయులగు మీకుఁ దెలియని దొకటికలదా. మాతండ్రి విన్న నేమనును. మీకు నావలని యాయాస మేమియుఁ గలుగనీయ

ను. నన్ను వెంట గొనిపొండు."

ఈ యమృతపుపల్కులు శ్రీరామునకు జాలిపుట్టించెను. ఆర్తరక్షణపరాయణులు గదా మహానుభావులు. శ్రీరాముఁడు సీతాప్రయాణమున కంగీకరించెను.

సీత, యుల్లాసముతో నత్త కౌసల్యాదేవికడ కేఁగి, ఆ సాధ్వీమతల్లి పాదపద్మముల కెఱఁగి, తన వనవాసమునుగూర్చి చెప్పెను. అత్త కౌసల్యకు సీతను పుత్త్రికనువలెఁ జూచుచుండును. ఆమె సీతను గౌఁగిలించికొని, "కష్టకాలమున పతినిందసేయఁ గాదు. స్వపూరుషుల నెప్పుడు సేవగింపరాదు. పతియె సతులకు గతి. నాబిడ్డను నెప్పుడును దెప్పకుము తల్లీ" యని పుత్త్రిప్రేమమును దెలుపు శ్వశురిపల్కులకు నలరి సీతాదేవి యిట్లనుచున్నది.

"మీరు చెప్పినధర్మములు జనకులవలన వినియున్నాను. మీయాజ్ఞానుసారము వర్తింతును. పదునాలుగేండ్లు గడచి వచ్చినతరువాత మీకే విందురుగాని, సాధ్వీపతివంటి బంధువుఁడు

ఈముద్దుపల్కులకు బ్రీతయై కౌసల్య మనోవేదనాభరయై సీత నాశీర్వదించి పంపెను.

సీతారాములతో లక్ష్మణకుమారుఁడును బయలుదేరెను. ఆతఁడు భ్రాతృసేవాపరాయణుఁడు గదా !

సుమంత్రుఁడు సీతకు నారచీరెలా యని యంగలార్చెను. పురజనులు వెంటరా, సీతారామలక్ష్మణులు యయోధ్యదాటిరి.

శ్రీరామునకుపవాసము పితృభక్తి వినియోగపర్యవసాయిగాఁ దోఁచెను. సీత కది నిరంతరభర్తృసేవావకాశముగాఁ దోఁచెను. లక్ష్మణుని కది దైవసేవావిలాసముగాఁ దోఁచెను.

తమసానదిని దాటిరి. గంగానదిని సమీపించిరి. శ్రీరాముఁడు సీతాదేవికి మందాకినీమాహాత్మ్యమును జెప్పుచుండెను. గంగానదీ ప్రవాహము సుకరముగా దాటఁదగినది గాదు. గుహుఁడు దశరథమిత్రుఁడు. ఆతఁడు నావను దెచ్చెను. శ్రీరాముఁడు ముందుగా సీత నెక్కించెను. తరువాత తానును లక్ష్మణుఁ డెక్కిరి. గంగ నవతరించిరి. గుహుఁడు వారి ననేకవిధములఁ దనయింట నుండుమని వేఁడెను. శ్రీరాముఁడు జడలు ధరించెను. పతి కనుగుణముగా సీత నారచీరెలు ధరించెను. అటనుండి భరద్వాజాశ్రమము చేరి లక్ష్మణనిర్మితమైన తెప్పపై యమునానదిని దాటిరి. చిత్రకూటమును చేరిరి.

దశరథుఁడు హా! పుత్రా! హా! పుత్రా! యని మరణించెను. మామయగు నశ్వపతినిఁ జూడఁబోయి భరతుఁ డయోధ్య కప్పుడే వచ్చెను. కౌసల్యాసమేతుఁడై భరతుఁడు శ్రీరాముని దర్శించెను. అయోధ్యకు వచ్చి యరాజకమైన రాజ్య మేలుమనియెను. కైకను నిందించెను. లక్ష్మణు ననునయించెను. వదినెను బతిమాలెను. శ్రీరాముఁడు దీక్షాన్వితుఁడు, పితృవాక్యపాలనాపరినిష్ఠుఁడు. ఇష్టపడ లేదు. పాదుకల నిచ్చెను. భరతుఁడు భ్రాతృవత్సలుఁడు. ఆపాదుకలకే పట్టాభిషేక మొనర్చి యన్నపేర రాజ్యమేలెను. కౌసల్యాదేవినే మాతగాఁ జూచెను.

ఇట సీత లత్రిముని యాశ్రమమునకుఁ జూడఁబోయిరి. అత్రిభార్య యనసూయ మహాపతివ్రత. ఆమె సీతను నారాధించెను. సీతానడవడి మెచ్చుకొనెను. సీతకు నామెకు స్నేహము గలిగెను. సీత కెన్నియో ధర్మము లుపదేశించెను. ఆధర్మములు కృతపరిచయములని యామె వదనేందీవరవికాసమువలన ననసూయ కనిపెట్టుచుండెను. సీతయు ననసూయాదేవికిఁ దానెఱిఁగిన

ధర్మపద్ధతిఁ జెప్పెను. ఆచరణమందలి యామె ప్రవృత్తి యనసూయకుఁ బ్రీతిఁగొల్పెను. ఆయిరువురి కొకళ్లకొకళ్లయం దవ్యాజానురాగ మంకురించెను. అనసూయ వారిని విడువలేక విడువలేక విడిచెను. అటనుండి వారు వనము నధిగమించిరి. దండకారణ్యము రాక్షససంకులము, దుర్గమమని సీతారాము లిదివరకే వినియున్నారు. దివ్యాస్త్రనిచయసమేతుఁడు, బాహాబలవిస్ఫూర్జితుఁడు, మహానుభావుఁడు శ్రీరాముఁడు, క్షత్రియవంశాలంకారుఁడు లక్ష్మణుఁడు. వీరట నడయాడుచుండఁగా విరాధుఁడు వీరినిఁ జూచెను. విద్యుల్లతవలె మెఱసిపోవు సీతను జూచెను. అనార్యులకు స్వపరకీయభేదము లేదు. భోఁగాములు లేవు. కరణీయాకరణీయములు లేవు. సీతనుహరించెను. శ్రీరాముఁ డొక్క వ్రేటున నాతనిఁ దునిమెను. హాహాకారములతో నాతఁడు ద్రెళ్లెను. ప్రవాసమున రాక్షససంహారణమునకిది యంకురార్పణము. అటనుండి శరభంగాశ్రమము చేరిరి. అదిదాఁటి సుతీక్ష్ణాశ్రమము. అటుపై నగస్త్యాశ్రమము. అగస్త్యమునిదర్శనము. అదిదాఁటి పంచవటిఁ బ్రవేశించిరి. ఇచ్చట లక్ష్మణుఁడు తన శిల్పకల్పనానైపుణి మీఱ పర్ణశాల నిర్మించెను. ఇట వారు దుంపదూఁడులఁ దినుచుఁ గొంతకాలము గడపిరి. మిథిలయందు వేదాంతవేదిని, అయోధ్యయందుఁ దూలికాతల్పమునఁ దూఁగు సుకుమారరాజకాంత—ఇప్పుడు వనవాసమున జటాధారి రామపత్ని. ఎప్పుడు సంతోషము. భూతకాల మామెకుఁ దలఁపునకురాక స్మరణలేని భూతమాయెను. భవిష్యత్తు బుద్ధిమంతులకుఁ జింతనీయమేకాదు. వర్తమానమే యామె వర్తననాశ్రయించుచుండెను. రామలగ్నమయిన సీతామానసమునకుఁ గాలస్మరణమున కవకాశ మెక్కడిది?

శ్రీరామునికి భార్య భారవహాగా లేదు. జనకజ సంతోష

జనకయని యూతఁ డనుకొనెను. లక్ష్మణుఁడు సీతారామపదసేవా పరతంత్రుఁడు గదా!

రావణసోదరి, శూర్పణఖకు దండాకారణ్యవిహారేచ్ఛ బుట్టెను. ఆమె సర్వస్వతంత్రి కామరూపిణి. అచ్చటచ్చటఁ దిరిగి సీతారాములుండు చోటికి వచ్చెను. అతినాసికాగ్రనాసికాదిభటవర్గమును, పదితలల యన్నను, ఆరునెలలు నిద్రించు సోదరకుంభకర్ణుని, సమస్తవికారదూషితులగు పరివారము నీక్షించుట కలవాటుపడిన నేత్రములు, సర్వాంగసుందరులగు శ్రీరామలక్ష్మణులను జూడఁగానే చాపల్యమునఁ బడి మనస్సును బురికొల్పెను. మనస్సు తనకోర్కెను దెల్పుటకు భాషను బ్రేరేపించెను. ఆవచోఘోషమునకు శ్రీరాముఁడు నవ్వి, లక్ష్మణునిఁ జూపించెను. లక్ష్మణుఁ డన్నను జూపెను. ఈపరిహాసమునకు పైబడి శూర్పణఖ సీతను మ్రింగఁబోయెను. శ్రీరాముని కనుసన్నను లక్ష్మణుఁడామె ముక్కుచెవులు గోసెను. అచటికి కనతిదూరమునున్న పినతండ్రి ఖరునిదగ్గరకుఁ బోయి, భోరుననేడ్చుచు నీయపకృతిఁ జూపెను. అతఁడు ముస్తైదై రామునిపైకిఁ గవిసెను. రాముఁడాతని నొక్కవ్రేటునఁ గూలనేసెను. ఇంకేమిగతి యని, అదివరకే పరాభవమునఁ గ్రాఁగుచున్న శూర్పణఖ, లంకాధీశుఁడు, బ్రహ్మవరమున నితరులను లక్ష్యపెట్టని మహావీరుఁడగు రావణునకుఁ దన్నుఁ జూపుకొని ఖరదూషణాదుల మరణమును వినిచి, దండకాటవి నరదూష్యమగుటను, ఖేదముతోఁ దెలియఁబఱచెను. రామమహిషి సౌందర్యమును వర్ణించెను. లావణ్యరాశి యగు జానకినిఁ జేపట్టని పౌరుషము వ్యర్థయని తృణీకరించెను. ఇంకేమేమి చెప్పెనోకాని రావణుఁడు మారీచకింకరునిఁ బిలిచి వానితో మంతనములు సలిపెను.

ఇట సీతారామలక్ష్మణులు జనస్థానమున బ్రవేశించిరి. చెట్లు క్రిక్కిఱిసియుండెను. స్వేచ్ఛావిహారమున లేడిపిల్లలు వనవీథినిఁ బర్విడుచు వనశోభఁ బెంచుచుండెను. సీత అనుచున్నది. "అదిగో, బంగరులేఁడి. ఎంత సుందరముగా నున్నది? దాని మీఁద నాకు మనసుగానున్నది." అనఁగానే సీతాప్రాణమగు శ్రీరాముఁడు ధనుర్బాణతూణీరములను ధరించి, లేఁడివెంట పరుగెత్తెను. ఆలేఁడి తటిల్లతవలె నప్పుడప్పుడు మెఱయుచు రఘూత్తముని దవ్వులయించెను. అతఁ డాకురంగము నెట్లయిన జీవముతోఁ బట్టితెచ్చి సీత కానుకగా నియ్యవలెనని తలంచి లేఁడి బెట్టిన త్రిప్పులన్నిఁ బడుచుఁ గానసమునఁ జరించుచుండెను. తుదకుఁ బ్రాణమువిసివి, బాణమేసెను. బంగరులేడి, చరమదశ యందుగూడ ప్రభుభక్తి చూపును. "హా! లక్ష్మణా!" యనుచు నేలఁబడి ఱోలుచు, విల విలఁ దన్నుకొనుచుఁ బ్రాణము విడిచెను. చూచుసరికదా మారీచరాక్షసుఁడు. ఇది మాయలేడి యని యప్పుడు కనుఁగొనెను.

హా! లక్ష్మణా! యనుపల్కులు దూరమందున్న సీతకు వినిపించెను. వినుటతోనే వ్యగ్రగా మఱఁది లక్ష్మణుని నిలువనీయలేదు. లక్ష్మణుఁడు సీతను గాపాడుచున్నాఁడు. సీత తనరక్షణముకంటె శ్రీరామరక్షణము ముఖ్యమనియెను. శ్రీరామునిలోనే సీత యునికి. సీతకుఁ బ్రత్యేకసౌఖ్యము జీవము లేదు. సీత యేమైనను సరియే. రామరక్షణము ముఖ్యము. పొమ్మనెను. లక్ష్మణుఁడు జాగుచేసెను. "పోవేమి. వెఱ్ఱివాఁడా రాముఁడులేని సీతలేదు." అని చెప్పెను. లక్ష్మణుఁడు "భద్రముగా నుండుము. ఈదండకాటవి స్త్రీల యొంటరితనమును గౌరవింపఁగల నాగరకస్థితిలో లేదు." అని చెప్పి పోయెను.

లక్ష్మణుఁడుపో వేగమే యొకయతి 'భవతీభిక్షాందదాతు' యని వాకిటనిలుచుండెను. ఆర్యగృహిణి యతిథిసేవాపరాయణగదా. దోసెఁడు పదార్థములతో వచ్చెను. యతితననిజస్వరూపముఁ జూపి నిన్ను వలచివచ్చితి ననెను. సీత పెడమొగము పెట్టుకొని యాదుర్మార్గుని నిందించెను. రావణుఁడు, ఒంటరికత్తెను, విమానముపై నెక్కించుకొని శరవేగము నధిగమించియాఁకాశవీథిని బోవుచుండెను. జటాయు వనుపక్షిరాజు వెంటఁబడి రావణుని చీఱిగిచ్చి యాయానము నాపఁజూచెను గాని యాతఁడీపక్షిని ఱెక్కలు తెగనఱికెను. అంతట నది క్రిందపడెను. పోవుచున్నది సీతాశరీరము ఆకాశవీథిని. సీతామానస మది రామలగ్నము. రామున కీదురాగతము తెల్పుటకై, అనసూయయను తన యుత్తరీయమునకు నగలుకట్టి క్రిందఁబడవైచినది. అవి ఋష్యమూకమున సుగ్రీవాదులదగ్గరఁ బడినవి. ఇప్పుడు వారు మహాసముద్రముపైనఁ బోవుచున్నారు. రాముఁడే హృదయమంతయు నిండియుండుటను సీతకు, రావణుని దూషించుటకుఁగాని తన భావిదశనుగూర్చి యోచించుటకుఁగాని తెఱపిలేదు.

ఇప్పుడు లంకానగరము చేరిరి. లంకిణి లంకాపరిరక్షిక. ఆమె యిది లంకకు ముప్పుగాఁ దలంచినది. రావణుఁడు, లోకవిద్రావణుఁడు, క్రూరనిశ్చయుఁడు సీతాదేవిని మహాసౌధమున నుంచెను. సీత కంటికిఁగడివెఁడుగా నేడ్చెను. మహాటవినిసైతము శ్రీరాముని చరణకమలము లెడఁబాయలేదు. హఠాత్తుగా, ఠొంగపోటుగా, మహావీరుల నేమఱించి, యీగతి నిటకు కొనిరాఁబడుటకు నీవిధిదుర్విపాకమునకు వగచెను. తలపంకించెను. మహాపవిత్రిలు పతినెడఁబాసినప్పుడు కృశలగుదురు. సీత యెండిపోవుచుండెను. గుండె ఱాయిచేసికొనినది. మహాసాధ్వి కెట్టికష్ట

ములు. తలఁపుకొలఁపునకు నదిమిపెట్టిన నాగనిదుఃఖము, అయోధ్యావాసమున, కంతరాయము, అరణ్యావాసము అది పితృభక్తి పరిపాలనముచే శ్రీరామునికి సుకృతదాయకము. సీతకు పతిసేవాఫలదము. సరే, లంకావాసమో ! సీతయేమనుకొనుచున్నది. స్థూలరూపధారుఁడగు శ్రీరాముని సేవించుచుంటిని. స్థూలరూపము సూక్ష్మరూపమునకు దారి. శ్రీరాముని సూక్ష్మరూపమును ధ్యానించుటకే లంకావాసకల్పనము. శ్రీరామాకృతిధారణము మహానందసంధాయకము. స్థూలరూపమును జూచునప్పుడు బాహ్యేంద్రియములకుఁ దీరనివని. మనస్సునకు విశ్రాంతి. సూక్ష్మరూపధారణమున నంతరింద్రియములకుఁ దెరపిలేదు. మనస్సున కితరవస్తుప్రచారము లేదు. సీతకీయోగసిద్ధిచే శోకము లయమయ్యెను. అనితరసాధ్యమైన శివధనుస్సువిఱిచిన మహాధీరుఁడు, దుష్టరాక్షససంహారమునకుఁ గల్పింపఁబడిన వీరపురుషుఁడు, సకలజగత్ప్రాణుఁడు, నన్ను, భర్తృపాదాసక్తను, ఒక్కతెను రక్షింపఁడా ! కర్మానుభవము తప్పదు. అని తలపోయును. సమాధిలగ్నమగు మహాయోగినివలె మెఱసిపోవుచుండెను.

ఇట్టి నిర్వికల్పచిత్త యగు జానకిని రావణుఁ డారాధింప మొదలుపెట్టెను. రావణుఁడు మహాతపస్వి. సకలభూతములు గడగడలాడునట్లు తపస్సునలిపి బ్రహ్మను బ్రత్యక్షముగావించుకొనిన మహామహుఁడు, పులస్త్యుని మనుమఁడు. శాత్రవదుర్నిరీక్ష్యమైన లంకారాజ్యాధిపతి. అఖిలభూభాగములయందలి రమణీలలామలను దెచ్చి యనుభవించుచున్న బలవంతుఁడు. మహావీరుఁడు. దైనవిధి. ఈఁతకాఁ డీఁతలోనే చచ్చును. పాములవాఁడు పాముకఱచి చచ్చును, వ్యభిచారి వ్యభిచారమందే మరణించును. అగ్నిశిఖవలె తపోమహిమచే నంటరాని దైన సీత

యం దాతని మనస్సు తగిలెను.

సీతావిగ్రహ మతనికన్నుల కానందకరముగా నుండెను. కన్నులు మనస్సును బురిగొల్పెను. మన సెప్పుడామె మూర్తినిఁ జూడసాఁగెను. రావణుఁ డెన్నిసారులు జూచినను, మనస్సునందు ధారణచేసినను, సీతామంగళమూర్తినేగాని, సీతామానసమును జూడలేకపోయెను. కామార్థికి బహిరింద్రియములే ప్రబలములు. రావణుఁడు కామోద్రిక్తుఁడై రామధ్యానాసక్తయగు సీతను, రామోచ్చారణపరిశిష్టను, సీతను, రామమంత్రానుష్ఠానపరను, సీతను, తపోధికను దయనీయుఁడ నని తెల్పుకొనెను. బ్రహ్మదులను తపశ్శక్తిచే గడగడవడఁకించిన పౌలస్త్యుఁడు నేఁడు భర్తృలాలసయగు నొక్క మానినీమణి యెదుట మోఁకరించి, ఎప్పుడు కన్నులదెఱచునా? ఎప్పుడావీక్షాప్రసారముచేఁ దరియింతునా యని ప్రతీక్షించుచున్నాఁడు. ఒక్కొకనాఁడు సీత కన్నులు విప్పనేవిప్పదు. ఆతఁడు విసిగిపోయి, మఱునాఁడు వచ్చును. మఱల నామె క్రీఁగంటిప్రసారమును వీక్షించును. మూర్ఖుఁడగు హఠయోగసిద్ధునివలె, రాముఁడుపట్టుదలమాత్రముచేతఁ బ్రసిద్ధుఁడు. ఒకనాఁ డాతఁడు వచ్చునప్పటికి సీత కన్నులు తెఱచి యున్నది. అప్పు డాతఁ డామెను దయావంతురాలవుక మ్మని యాచించెను. మహాపతివ్రతలు పరపురుషులతో మాటలాడరు. అందు కామార్థి, దుష్టబలుఁడు, వంచకుఁ డగు నాతనితో భాషించునా? చిలుక గొట్టిపోసినట్లు, తా నిదివరకు స్త్రీలను వ్యామోహింపజేయుట కుపయోగించిన మోహోపాదకములగు మాటలను గ్రుమ్మరించెను. ఆతనికి వచ్చినభాషయంతయు నయిపోయెను. సొమ్మసిల్లెను. సీతాప్రతివచనము లేదు. నిస్పృహుఁడయ్యెను. కాముకుఁడు మొండి. మఱల వర్ణసమామ్నాయముచేఁ గ్రొత్త

క్రొత్త యూహలతో శబ్దించెను. సీతాప్రతివచనము లేదు. అతఁడు విషాదమును బొందెను. పంచాక్షరిని వేలు, లక్షలు, కోట్ల కొలఁది జపించుట కలవాటుపడిన మూర్ఖ భక్తుఁడు కాముకుఁడు అతని శబ్దజాల మింక లేదు. సీతాప్రతివచనము లేదు. ఏమిచేయును. కన్ను లున్నవి. సీతామంగళవిగ్రహము కాన్పించుచున్నది. నేత్రములు మనస్సును రేఁపుచున్నవి. మనస్సు శబ్దములను గల్పింపలేదు. ఉన్నశబ్దములను జూపఁగలదు. శబ్దములు వ్యయమైనవి. ఈమూర్ఖున కింకఁ గోర్కె వ్యయముగా లేదు శబ్దములు చేయనిపనిని, మూఁగవానివలె సంజ్ఞలచేఁ జూపెను. సీతాప్రతివచనము లేదు. తుదకు జంతుప్రాయుఁడై, కాళ్ళపైఁ బడఁబోయెను. విసివి వేసారి మూర్ఛాశరణ్యుఁ డయ్యెను. సీతాసతి యీకామదహనమగు జంతువును వీక్షించెనో లేదో కాని, రావణుఁడు కొంతవడికిఁ దనకుఁదానే సేదఁదేరి, ప్రతివచనములేని సీత నప్పటికి విడిచి పోయెను. పోయినను సీతామంగళరూపమాతని నేత్రములయందుఁ దటిత్తువలె మెఱయుచున్నది. చూపు కేంద్రీభవింపఁజేసి చూతమన్న నిలువదు. మఱల నిలుచును. ఈతఁ డున్మత్తుఁడైనాఁడని లంకాజన మనుకొన్నది. ఈతఁ డింకను సీతాప్రసాదమున కఱ్ఱుచాఁచికొని యున్నాఁడు. అశోకవనిలో వికారరాక్షసుల తర్జనభర్జనముల మధ్య దీపకళికవలె మెఱసిపోవుచున్న సీతావిగ్రహము ను మఱలఁ జూచినాఁడు. ఆరాధించినాఁడు. ఈమూఢపూజ కామె ప్రతివచన కాలేదు. తలలు నేల కొట్టుకొనినాఁడు. ప్రతివచనము లేదు. మాంసమునువండి భక్షింతునన్నాఁడు. బెదరించినాఁడు. ప్రతివచనము లేదు సరేగదా భయము, కంపము, చలనము లేదు. ఇది ప్రాణహీనయగు ప్రతిమయేమో, నేనింతకష్టపడి యీప్రతిమనా తెచ్చుకొం

టి నని లోలోన సిగ్గుపడుచున్నాఁడు. పోనీ ముట్టికొని స్పర్శసుఖము నొందుడమా యని యనుకొనెనేమో మఱల మూర్ఛాగతుఁడైనాఁడు. సీతాదేవి చూచుటఁగూడ లేదు. మఱల సేదఁదేరినాఁడు. మొండికామమునకు సిగ్గులేదు. సీతావిగ్రహధారణమాతని నేత్రములనుండి పోదు. ఒకప్పుడు యావత్ప్రపంచము ప్రళయమున లీనమైనట్లు తలంచును. ఒకప్పు డింకను నాశయున్నదనుకొనును. అప్పటికి విసికిపోయినాఁడు. నిద్రరాదు. ఇంద్రియములు లంఘనములఁ జేయుచు, కొంచెము సడలినవి కాని కామము మఱింత ప్రబలమాయెను. చావో, కూటమియో, యీసారి తప్పదని తెగించి బయలుదేరినాఁడు. అప్పటికి సీతాదేవి తృణమును బెట్టుకొని పలుకుచున్నది. ఆ కులుకుపలుకు దనకు ఫలకారి కాకున్నను, భూమ్యాకాశములను రెండుపెదవుల నుండి కలిగిన మహాశక్తిసమన్వితమగు శబ్దమును జెవులారఁ గ్రోలినాఁడు. ఇంతవఱ కాతని జన్మలో నిట్టిశబ్దమును వినియెఱుఁగడు. ధ్వనిమాధుర్యమునకుఁ జెవులు దోరఁగిలబెట్టుకొని యున్నాఁడు. ఎక్కడ ధ్వనిలోఁగొంత వినపడకపోవునో యని చెవులను నిక్కించి, కఃహారముల నవధారణయోగ్యము చేయుచున్నాఁడు. విన్నాఁడు. వినినదాని కర్థమును, శబ్దమాధురీమత్తత వీడినపిమ్మట విచారించినాఁడు. ఆవురని యేడ్చినాఁడు. పదినోళులయేడుపు లశోకవనమంతయు నిండినవి. ఆతఁ డెప్పుడిట్లు రోదనము చేయలేదు. సీతావచనమం దేమిగలదో. అబల, నిరాధార, పల్కినశబ్దమం దేమిగలదో! పరాభవవివర్ణుఁడై, యాతఁ డేమిచేయుచున్నాఁడు. దండకారణ్యమున శ్రీరాముఁడే లేఁడు. ఆతఁడు మరణించియుండును. నీ వాతనితలంపు విడువుమని చెప్పఁబోయి, నోరురాక గుటకలు మ్రింగుచున్నాఁడు. సీ

వాంటరికత్తెవని కావలియున్న రాక్షసస్త్రీలతో నామెను నయ
భయముల లొంగఁదీయుమని చెప్పి సాధనాంతరమును యోజిం
చుటకు వెడలినాఁడు.

సీత, అప్రతిమానతేజోనిధి యగు లోకమాత, రామప
దాబ్జధ్యానోపేత, దూతలకు వినమ్రయగునా? ధర్మపాలకులకు
మరణమువలని భయముకలుగునా? కష్టపరంపర లుత్సాహో
ద్రేకకరములు. కార్యసాధన కూఁతకోలలు. మనోరథమునకు
శృంగాటకములు. ప్రాణాపాయమునకు వెరువని సీతను, రాక్ష
సమాత్రిక లేమిచేయఁగలరు? నిర్విణ్ణలై వారిక నాసలేదని
విడిచినారు. సకలభువనభోంతరాళముల మనోగతిని విహారమొ
నర్చు సీత కశోకవన మొక నిర్బంధమా! అరిషడ్వర్గమును జ్ఞా
నరజ్జువులచే మెదలనీక బిగింపఁగలిగిన జ్ఞానరాశికి, రాక్షసమాత్రిక
లొక యడ్డా! ఆమె యెట్లున్నదో? ఏమిచేయుచున్నదో జ్ఞాన
లవలేశములేని లంకలోని రాక్షసుల కెట్లు తెలియును. విభీష
ణుఁడు జ్ఞాని. ఆతఁ డార్యపుత్త్రుఁడు. శ్రీరామునిఁగూర్చి వినియు
న్నాఁడు. ఆతఁ డివృత్తాంతమును విని, సీతకు శుభముఁదెలుపుట
సరమను బంపెను. లంకావాసుల మాయారూపములను జూచి
చూచి విసువుఁజెందియున్న సీత కీసరమపల్కులు వింతగాఁ దోఁ
చెను. ఎటులైనసరియే యని యావీరపత్ని సీత పల్కులవలన
విభీషణుఁ డాసీతాసతి యతీంద్రియజ్ఞానమున కలరెను. అజ్ఞాన
మునకును జ్ఞానము కేక యుద్ధమగునని తలంచెను. తనసోద
రుఁడు మూర్తీభవించిన యజ్ఞానము. కాని జ్ఞాన మజ్ఞానముచే
జ్ఞాతమగునని యనెను. ఆగూఢవేదాంత మచ్చటివారి కెవ్వరికిఁ
దెలియలేదు. జ్ఞానమును జెఱనుంచి, వశపఱచువారికి జ్ఞానతత్త్వ
మెట్లు తెలియును.

జ్ఞానోపాసకుఁడు వాయుతనూజుఁడు. హనుమంతుఁడు. అజ్ఞానబాధితమై జ్ఞానము లంకలోఁజెఱఁబడియున్నదని విన్నాఁడు. విశాలసాగరము దాఁటినాఁడు. సింధుబంధితమైన లంకను జూచినాఁడు. మూర్తీభవించిన జ్ఞానమునకై వెదుకసాగినాఁడు. మేడలు మిద్దెలు, ఎక్కడఁజూచిన రాక్షసాకారమైన యజ్ఞానమే. ఏమి! పొరబడితినా యని యనుకొనినాఁడు. అశోకవనికిఁ జనినాఁడు. రాక్షసస్త్రీలమధ్యనున్న సీతామూర్తిని, జ్ఞానపుంజమును గనినాఁడు. చూడఁగానే యాతని కానందము గలిగెను. అప్పుడు కనుఁగొనినాఁడు. శ్రీరాముఁడిందులకుఁగదా జ్ఞానహీనుఁడైనాఁడని తాను రామబంటనని తెలుపుకొనినాఁడు. ఆనవాలు చూపినాఁడు. సీత యానవాలునుబట్టి యితఁడు జ్ఞానాన్వేషియని కనుఁగొనినది. మఱలఁ దన నగ యానవా లిచ్చినది. విరాటస్వరూపమందు లయమయి, ప్రత్యేకత్వమును బాపుకొని సుఖింపఁ జూచు, సీతావాంఛను, నాపరాత్పరుని కెఱుకఁబరుపు సందేశమును శిరమునఁ బూనినాఁడు. తానే జ్ఞానమూర్తి సీతను గైకొని శ్రీరామార్పణము చేయఁదలఁచెను గాని సీత యాతనికాశక్తి లేదని తెలియఁజేయఁగాఁ దన కొలఁదిని దెలిసికొని, లంకనుగాల్చి ఋష్యశృంగమున కేఁగి, సీతావార్తఁ దెలిపినాఁడు. శ్రీరామ సుగ్రీవ జాంబవంతాదులందఱు సేతువును, శ్రీరామానుగ్రహమున బంధించి, లంకఁ జొచ్చి, రావణుఁ బరిమార్చి, విభీషణుని లంకారాజ్యాభిషిక్తునిఁ జేసినాఁడు. సీత, కామాంధకారమగ్నమలీమసుఁడగు రావణుని లంకానివాసముచే సుస్నాతనుఁజేయింపఁగోరి భగభగ పొగలెగయు యగ్నికుండబ్రవేశమునఁ దప్తకాంచనమువలె వెలిఁగిపోవునట్లొనర్చి, అజ్ఞానావృతులకు సీతామాహాత్మ్యమును జెప్పి, కుబేరదత్తమైన రావణపుష్పకము నె

క్కి, సీతాదేవీసమేతులై యందరయోధ్య నధిగమించిరి.

కుబేరపుష్పకము మనోవేగమున మహాసముద్రమును దాటుచుండెను. దానిపైని వారధిని సీతాసతి వీక్షించుచుండెను. లక్ష్మణుడు చెప్పుచున్నాడు. "మునుపీవారధి లేదు. ఇది అన్నగారు లంకాయుద్ధమునకు సుగ్రీవబలము వచ్చుటకై నిర్మించినారు. సముద్రుడిది గట్టువర కెడమిచ్చినాడు." తన్నుద్ధరించుటకై శ్రీరాముడింత శ్రమపడెనా యని సమిత్రీభూతయై సీత వినయమును సూచించెను. పుష్పక మిప్పుడు భూమిపై బోవుచున్నది.

ఇప్పుడు దండకారణ్యమున జనుచున్నది. ఇదిగో ఇదే కిష్కింధ. ఇచ్చటనే సుగ్రీవునితో సఖ్యముచేసినది. కొంచెముపోగా, ఇచ్చటనే మహావీరుడగు వాలితోడిద్వంద్వయుద్ధము. యిదే ఋష్యమూకము. ఇదే శబరి. ఇల్లిదిగో పంపాసరోవరము. శ్రీరాముడనుచున్నాడు. "ప్రియసీ, ఇచ్చటనే నిన్ను వెదకితిమి. ఈప్రాంత మతిరమణీయముగ నున్నదే. అశ్రుజలపూరితుడనై యానాడీవనశోభను గాంచలేకపోతిని. పుష్పక మిప్పుడు త్వరగుదియించి మందగమనమున బోవుచున్నది. ఇదే మాల్యవంతము. లక్ష్మణు డనుచున్నాడు. అదిగో ఆతరుస్కంధమునసే యన్నగారు దుఃఖితులై మూర్ఛావివశులైనారు. శ్రీరాము డిట్లనును. "లక్ష్మణకుమారా ! ఇచ్చటనే నీవు ననన్నాదరించినది. ఏమిదినములోయి యవి ?"

ఇప్పుడు పుష్పకము మిక్కిలి వేగముగా బోనిమ్మని లక్ష్మణుడు పల్కుచున్నాడు. ఇదిగో పంచవటి. సీత, "ఆమాట చెప్పకు" మన లక్ష్మణుడు "రావణహతకుడు మరణించినాడు" ని చెప్పినాడు. సీతాదేవి శ్రీరామునిజేరి కూర్చుండెను.

పుష్పక మిప్పు డయోధ్యానగరము సమీపించుచున్నది. ఎన్నాళ్ళ కెన్నాళ్ళ కయోధ్యాప్రవేశము. పదునాలుగేం డ్లెట్లుకడపితిమో. అయోధ్యావాసపుదినములు జ్ఞప్తికివచ్చుచున్నవి. జన్మభూమివాత్సల్య మిట్టిదిగదా యని శ్రీరాముఁ డనుచున్నాఁడు.

అయోధ్యలో దిగినారు. పురీస్త్రీలు నివ్వాళులఁ బెట్టినారు. వేదవాదులు వేదప్రవచనములు సేయుచున్నారు. సకల మంగళవాద్యములు భోరున నొక్కపెట్టున మ్రోఁగుచున్నవి. అయోధ్య నవవికాసముతో, రమణీయముగా నున్నది. సుగ్రీవాంజనేయాదులు యథార్హముగా సత్కరింపఁబడిరి. శ్రీరాముని పాదుకలఁ బెట్టుకొని భ్రాతృభక్తిప్రవణుఁడగు భరతుని యానందమునకును, కైక పశ్చాత్తాపమునకు మేరలేదు. వసిష్ఠగురువులు శ్రీరామునకుఁ బట్టాభిషేక మొనర్చిరి. శ్రీరామచంద్రుఁడు శాస్త్రోక్త విధమునఁ బ్రజారంజకముగా రాజ్య మేలుచుండిరి. దేవేరి సీతాసతి, శ్రీరాములుకుఁ బూవును దావివలె, శబ్దము అర్థమునవలె, సూర్యుని కాంతివలె లలి వెలుంగుచుండిరి.

సీతాసతి గర్భధారిణియయ్యెను. కౌసల్య యీవార్తవిని పరమానందముఁ జెందెను.

ఆర్యగృహమునఁ జూలాలు పూజనీయ. వంశాంకురము. ఆమూలమునఁ బితరుల మోక్షము. కన్నతల్లికి లోకమున గౌరవము. పరలోకమున ముక్తి. సంతానముగనుటయే భారతవర్ష స్త్రీకి జన్మఫలము. ఇప్పుడు మిథిలనుండి జనకాదులు సమస్తబంధువులు వచ్చియున్నారు.

శాంత దశరథపుత్రి. శాంతాపతి ఋష్యశృంగమహర్షి యజ్ఞముసేయుచు నందఱ నాహ్వానము చేసెను. గర్భధారిణి యగు సీతను దోడ్కొనిపోవుటకు వీలులేక యామె వినోదమునకై

రాముని, లక్ష్మణుని యయోధ్యయందే యుంచిరి. జనకులును మిథిలకుఁ బోయిరి.

సీతారాములు లక్ష్మణసహాయులై యిప్పు డయోధ్యలో సుఖముగానున్నారు. సీతకు నెలలు నిండినకొలఁది మనస్సునందు భయముతోఁచెను. ఆమెకు శ్రీరాముఁ డెన్నియో వినోదములను గల్పించి వినోదపఱచుచుండెను. శ్రీరాముఁడు, సీతానురాగవిసియోగజన్ముఁ డని సీత కిప్పుడు తోఁచెను. వారిరువురు వనవాసమునుగూర్చి చెప్పుకొనుచుండిరి. సీత, లంకావాసమునుగూర్చి చెప్పెను. రాముఁడు సుగ్రీవసఖ్యము, సేతునిర్మాణము, రావణయుద్ధము మున్నగు వానినిఁగూర్చి చెప్పెను. సీతయాంజనేయభక్తునిఁ గూర్చియు శ్రీరాముఁడు విభీషణునిఁగూర్చియు నిట్లొకరికొకరు తాము ప్రత్యేకముగా నెఱిఁగిన విషయములనుగూర్చి చెప్పుకొని, వనవాసనివాసమునుగూర్చిన చరిత్రమును బూర్తిచేసికొనుచు వినోదించుచుండిరి.

ఋష్యశృంగమహాముని పంపిన యష్టావక్రుఁ డేతెంచి సీతారాములను దీవించెను. సీతారాములు ఋష్యశృంగాదుల క్షేమమడిగి, యజ్ఞపూర్తినిఁ దెలిసికొని, తాము రాజాలమికి క్షమాపణమును వేఁడికొన, అష్టావక్రుఁడు సీతను వీరమాతవగుమనియు శ్రీరామునిఁ బ్రజారంజకపరిపాలకుఁడవుకమ్మనియు వసిష్ఠులాశీర్వదించిరని వినఁగానే దంపతు లంజలిబంధమును ఘటించి వసిష్ఠులకు రఘువంశమందలి యవ్యాజప్రేమమును గొనియాడిరి. అష్టావక్రుఁ డేఁగెను. సీతారాములు సౌధాంతరమున మంతనములఁ దేలుచుండిరి. సీతకు నిద్రవచ్చెను. దీనజనశరణ్యమును, సమస్తాపదపహారకమగు శ్రీరామబాహువు తలగడగా నిడికొని సీత నిద్రించెను. శ్రీరాముఁ డిప్పుడు రాజు. ప్రజాపాలనమును

నార్యనీతిని నాల్గుపాదముల నడపుచున్నాఁడు. రామునియేలుబడిలో రాజనీతి లోకనీతిగా నుండెను. రాముఁడు నామమాత్రుఁడు. ఏలుబడి ప్రజలది. ప్రజల యభిప్రాయమే మూర్తీభవించిన యాచరణీయము. రాముఁడు ప్రజాభిప్రాయమును నడుపు సాధనము. శ్రీరాముని రాచఱికము లోకరంజనప్రవృత్తము. లోకమేయేవిషయమున నేమనుకొనెనో యదార్థమును దెలిసికొనివచ్చుటకై నియమింపఁబడిన చారుఁడు వచ్చెను. శ్రీరాముఁడు వార్తయేమి? జగ మెట్లు వర్తిలుచున్న దని యడిగెను. చారుఁడు లజ్జపడెను. దైన్యమును జూపెను. రాముఁ డాశ్చర్యపడెను. చెప్పుమనెను. ఆతఁడు చెప్పజాల ననెను. శ్రీరాముని మనస్సునందు సంకోచము తోఁచెను. మనస్సు పరిపరివిధములఁ బోయెను. తుదకు సీతను మెల్లఁగా దిండుపై దింపి కక్ష్యాంతరమునకు వచ్చెను. ఇప్పుడైనఁ జెప్పుము. నామనస్సు పరితపించుచున్న దనెను. ఆతఁడు సీతలంకావాసము- రావణుఁడు దుర్మార్గుఁడు- సీత మహాపతివ్రత- ఒంటరితనము- స్త్రీల చంచలత- రాక్షసులకూరనిశ్చయత- అని వడఁకుచు, తారుమారుగ, చెప్పియుఁ జెప్పనట్లు, చెప్పఁగలిగియుఁ జెప్పలేనట్లు, చెప్పరాకయుఁ జెప్పుచున్నట్లు, జిహ్వాదిసర్వాంగములు లజ్జించునట్లు, కొంతసేపు నిశ్శబ్దతను బ్రకటించుచు, కొంతసేపు సత్త్రివానివలె శబ్దాపశబ్దములు, స్వరాపస్వరములు, కలిపి మొత్తముమీఁద నెట్లో పాట్లుపడి సీతానిర్మలతాపుం దేహమును జెప్పి మూర్ఛిల్లెను.

శ్రీరాముఁడు సీతాహృదయవేది. ఇదివఱకే లోకాపవాదభయమున సీతనగ్నిముఖమునఁ బరిశోధించి, తీరని పరితాపమున లోలోన లజ్జించుచున్నవాఁడు. ఇప్పుడు సీత సంపూర్ణగర్భ. ఆసన్నప్రసవ. సర్వోపచారయోగ్య. సమాదరణీయకాం

ము. ఇట్టిసమయమున లోకరూపమైన దైవశోధ. ఇందులకు సీతామనోవేదియే సాధనము. లోకచరిత్ర మతివిచిత్రము. సామాన్యజన దుర్జ్ఞేయము.

సీత నిద్రనుండి లేచినది. ఆర్యపుత్రా! యనినది. ఆర్యపుత్రుఁడు దీనవదనుఁడై దరికేఁగినాఁడు. సీత చెప్పుచున్నది. “ నే నొక కలఁగంటిని. నే నరణ్యావాసము చేసినట్లు, ఋషుల సందర్శనము చేసినట్లు, కందమూలాదు లాహారయోగ్యము లైనట్లు, ఇంకేమేమో, మఱి యేమేమో.” ఈకలఁ గనినప్పటినుండి నాకు మరల వనసంచారమందు మనస్సు దగిలియున్నది. ఎప్పుడు వనసందర్శనసౌభాగ్యము గలుగునా యని మన మువ్విళ్లూరుచున్నది. శ్రీరాముఁడు దైవచేష్టితముల కాశ్చర్యపడుచున్నాఁడు. సరే, దీనికేమిభాగ్య మాటలనే చేయవచ్చునని చెప్పి వెడలినాఁడు.

అతనిమనస్సు లోకాభిప్రాయమును న్నది. రాజు ప్రజలకు మార్గదర్శి. ధర్మతత్త్వమును బరిశీలింపగలవాఁ డెవ్వఁడు. దాని పోకడలను గనుఁగొనుటకు జ్ఞానప్రవణులగు మహామునులకే సుకరము గాదు. సామాన్యప్రజ ధర్మమును దాని ననుష్ఠించు మహామహులనుండి గ్రహించును. రాజపదవి ధర్మనిరూపణమునకు ముఖ్యస్థానము. భగవత్స్వరూపమయిన ధర్మమును బ్రజలకుఁ దెలుపవలసినవాఁడు రాజు. రాజటు ధర్మమునకును, నిటు ప్రజలకును మధ్యవర్తి. ధర్మము వ్యత్యాసముఁజెందెనా అటు దైవవిలాసమును బ్రకటింపఁజాలని లోపమునకును, బ్రజల ధర్మానుచారయోగ్యులను గావింపమికిని, రెంటను శిక్షితుఁడు గావలసివచ్చును. రాజ్యభార మింత కష్టము. నేను రాచఱికమున

లేకున్న నాకుఁ బ్రజాభిప్రాయముతోఁ బనిలేదు. రాజ్యమును ద్యజింతునా! సీతనా? రాజ్యభారము సూక్ష్మశరీరులగు దేవతలు, స్థూలదేహులగు వసిష్ఠాదిఋషిసత్తముల యెదుట నా యొప్పిదము ననుసరించి నాపైఁ బడినది. ఒప్పుకొనినదానిని వయోభారమున సుపుత్త్రులపైఁ బెట్టువాఁడ, కష్టసుఖములకు జంకక, నిర్వహించుట పురుషార్థము. హా! సీత, నిందుమాలాలు. ఇప్పుడా పరిత్యాగము. ఏమీ దైవశోధ. సీతాచరిత్రము లోకమునఁ గష్టపరంపరాచరితముగా బరిణమింపవలయునుగాఁబోలు. సీత పతివ్రత. అయోధ్యాప్రజలు పదునాలుగేండ్లనాఁడు ముగ్ధయగు సీతను జూచిరి. మఱల నేఁడు చూచిరి. వారి కిదివరకు రావణదుష్టత్వమును వినియున్నారు. సీతానిరతి నెఱుఁగరు. సీతాచరిత్రమును గనుఁగొనుటకు వారి కవకాశము లేదు. రాము భార్యగాక మఱి యెవ్వరిభార్యయైనను వారిట్లే యనుకొందురు. లోకమున నొక్కతలయా. ఎందరో, అనేకుల కొక్కయభిప్రాయము గలిగినప్పు డది దురభిప్రాయ మైనపక్షమున నది చక్కఁబడుటకుఁ గాలమే యమూదితగురువు. కాలముమాత్రము సీతాపాతివ్రత్యమును లోకులకుఁ జూపదా!

ఇప్పు డేమిచేయవలయును. సీత పూత యని తెల్పుటకు లంకయందువలె నగ్నిప్రవేశ మొనర్పవలయునా—ఎఱిఁగియుండియు నిదివరకు సీతాశోధ జరిపినందులకే పరితపించుచున్న నా మన మిూదారుణకృత్యమున కొడిఁగట్టునా? అదిగాక సీతకు వనవాసముపై నపేక్షజనించియున్నది. ఆమె కాంక్షఁ దీర్చుట యవశ్యాచరణీయము.

ఇట్లు విచికిత్సితుఁడై లక్ష్మణ భరత శత్రుఘ్నుల నొప్పించి, సీత నడవికిఁ బంపుటకు రథ మాయత్తపఱచెను. సీత యేమి

యు నెఱుఁగదు. రథముపై నెక్కెను. లక్ష్మణుఁడు వెంటనుం డెను. అరణ్యమునకుఁ జనుచుండెను. లక్ష్మణుఁడు భ్రాతృవత్స లుఁడు. సీత కేమియుఁ దెలుపఁడు. సీత, అరణ్యమును వర్ణించు ను. సంతసించును. తాపసాశ్రమములను జూచెడు కుతూహ లత, గౌతమీనదిని గ్రుంకులిడెడు యభిలాష, ప్రకృతివిలాస ములను గనుఁగొనెడు యపేక్ష, యొకటికంటె నొకటి యామె ను త్సుకను గావించుచుండెను. గౌతమినిఁ జేరిరి. రథము దిగిరి. లక్ష్మణుఁడు ఖిన్నవదనుఁడై కన్నులనీరు కాల్వలుగట్టఁగా నేడ్చు చున్నాఁడు. సీతమనస్సులో దిగులుపుట్టినది. రావణాపహృత కాఁబోవుముందు నిట్టి యనుతాపమే తగిలినది. ఇప్పుడు నట్లే యున్నది. కారణ మారయక యే దుఃఖాక్రాంతురాలైనది. లక్ష్మణుఁ డామెను జూడలేక మారుమొగము పెట్టుకొన్నాఁడు. సీత యాతనితో ననుచున్నది. లక్ష్మణా! ఏమి! అన్నగారు సుఖులా! నామనస్సు దిగులుపడ్డది. ఎవరి కేమివిపత్తు వాటిల్లి నున్నదో? ఏమి చెప్పవు. లక్ష్మణుఁడు భాతృనాసతిఁ జెప్పఁబో యి డగ్గుత్తికచే మాట తడఁబడ నేమియు ననలేకున్నాఁడు. సీత యడుఁగుచున్నది. లక్ష్మణకుమారా! చెప్పుము. నా కేయాప దయైన రానిమ్ము. అన్నగారు సుఖులనుము. ఆర్యకౌసల్యాదేవి కి క్షేమమా. తక్కినవారు కుశలమా! లక్ష్మణుఁ డందఱు కు శలులే యని దుఃఖించుచున్నాఁడు. అందఱికిఁ గుశలమైన నిఁక దుఃఖించుట కేమున్నది. నన్ను విడనాడలేక దుఃఖమా. నే నె ప్పుడు కావలయునన్న నప్పుడే వచ్చెదను. వెనుకటి వనవాసము జ్ఞప్తికివచ్చుటను గలిగిన దుఃఖమా! లక్ష్మణుఁడు కాదని దుః ఖించుచున్నాఁడు. సీత యనుచున్నది, నామన స్సారాటముచేఁ బొగలిపోవుచున్నది. చెప్పి నాయారాట ముడుపుము. ఈసంధి

ద్ధావస్థను భరించుటకన్న నెట్టికష్టమునైన భరించుట సుకరము చెప్పము. అది నాకుఁ గష్టాపాదిదైనను నిన్ను నిందింపను. లక్ష్మణుఁడు మనస్సు పగిలి యిట్లనుచున్నాఁడు. తల్లీ! రాజు ప్రజల కాత్మ. ప్రజారంజనమే యాత్మరంజనమని భ్రాతృవర్యుల తలంపని పల్కుచున్నారు. సీత యార్యపుత్రుని రాచఱికపుపద్ధతి యిట్టిదే. వసిష్ఠులవారి యుపదేశము నదియే. లక్ష్మణుఁడు మఱల ననుచున్నాఁడు. అయోధ్యాప్రజలు రావణుఁడు మిక్కిలి దుర్మార్గుఁడని ఘోరదురాచారుఁడని నిందించుచున్నారు. సీత, రాక్షసఘోరకృత్యముల చారిత్రి మార్యావర్తమంతయు నిండిపోయినదా? లక్ష్మణుఁ డనుచున్నాఁడు. అమ్మా, లంకయందన్నాళ్ళు మిమ్ముల నుంచుట—అని భోరున దుఃఖించుచున్నాఁడు. సీత వికారముగా నవ్వుచు లక్ష్మణకుమారా! నీదుఃఖకారణము తెలిసినది. లోకాపవాదభీతికై నన్ను పరిత్యజించిరి. నీ వెందులకు దుఃఖించెదవు. నాజన్మమే దుఃఖపరంపర. చిరకాలవియోగానంతరము, మృత్యువుకంటెను నీచమగు రాక్షసాపహ్నృతికిఁ దరువాత నార్యపుత్రసమాగమము గలుగుటయు, అద్దము చూచుకొనుచుండఁగనే వెనుకనై పుసకుఁ ద్రిప్పినట్లు, నాపురాకృతము నన్ను వెన్నంటె, ఆర్యపుత్రునికి దూరముచేసెను. విధికి మాత్రము జాలివలదా. ఎంతటి దుఃఖమైన ననుభవింపవలసినదేనా. ఆర్యపుత్రుని ప్రేమ నే నెఱుఁగనా. ఇది కర్మఫలము. గర్భవతినే, ప్రాణపరిత్యాగమున గర్భస్థశిశుహతిచే భ్రూణహత్యాపాతకము నా మెడ కురితాడై జన్మజన్మాంతరములకుఁబోదే ఏమిగతి. చచ్చిపోవుటకుఁగూడ వీలుగాకుండఁజేసి విధీ! నన్నిను మలఁ గుడిపెదవా! హా యని పెద్దపెట్టున నొక కేకవేసి మూర్ఛావివశురా లయ్యెను. లక్ష్మణుఁ డీయవస్థను జూచి మరియుఁ

కఁ జూడలేక మూర్ఛిల్లెను.

సీత మూర్ఛదేరి లక్ష్మణునిఁ దేర్చెను. సీత యిట్లనుచున్నది. "ఆర్యపుత్రుని ధ్యానముచేయుచుఁ గాలము గడపెదను. నాకేమికావలయును ఆర్యపుత్రులు సుఖముండవలయును. అన్నగారొంటరిగానుందురు. నీవు కుడిభుజమవు. పొమ్ము." లక్ష్మణుఁడీ సుకోమలములగు పల్కుల యందలి వజ్రకఠినభావమునుగూర్చి చింతించుచున్నాఁడు. ఇరువురు రెండవగు లెవరిదారినివారు పోవుచున్నారు. లక్ష్మణుఁడు సీతాదిక్కుమొగమై అమ్మా సెలవాయని గద్గదికతో ననుచున్నాఁడు. లక్ష్మణా ఇది కర్మానుభవము. బ్రహ్మాదులును కర్మబద్ధులు. కాలమే కర్మాధికారి పొమ్ము. ఆర్యపుత్రుల నడిగితినను ము. కౌసల్య నడిగితినను ము. తక్కిన మనవారినందఱిని వేఱ్వేఱ నడిగితినను ము. లక్ష్మణుఁడు దుఃఖము నాఁపుకొనుచుఁ దేలియాడు నడుగులతోఁ దహింపఁబడుచున్న మనస్సుతోఁ బోలేక పోలేక పోవుచున్నాఁడు. సీత చూపుమేరవరకుఁ జూచినది. లక్ష్మణుఁడు దృష్టిపదమున లేఁడు. సీత యొంటరికత్తెయైనది. ఎవ్వరులేరు. పైన గాఢమగు నాకాశము. క్రిందభూమి. ఇప్పుడెవ్వరులేరుగదా. దైవమా! నేనెప్పుడు పతిపదాసక్తనుగదా! నాకీకష్టములా! ఎల్లప్పుడు నాబ్రదుకు శోధలతోడనే సరియా! ఒక్కసారి యిప్పుడొక పిడుగువైచి వెతలఁగుడుచునీశరీరము నంతమొందింపరాదా! ఎల్లకాలము నాపృథక్ఛరీరములకన్యత్రవాసమేనా. ఇదియే పరమతారకమా. నామానసము శ్రీరామపదములనుండిమఱల్పఁగలదా కర్మయు దాని తాతకాలమును హా! దుఃఖము! హా! కష్టము.

ఈయార్తనాదములు వాల్మీకిశిష్యులు ఫలసమిత్కుశాములను దెచ్చుటకై వచ్చి వారువిని గురువాల్మీకులతో మనవిఁ

జేసిరి. సీతాచరిత్రమును లోకప్రవృత్తిమార్గదర్శకముగా వ్రాసిన వాల్మీకులు తపోధికతచే భూతభవిష్యత్తులను స్వాధీనముఁగావించుకొనిన దైవతుల్యులు నిమేషమాత్రమున నాయార్య సీతయని తెలిసికొని తత్క్షణమే యాశీర్వచనపూర్వకముగా నేఁగియాపెనుఁగొని తేర ననుజ్ఞయిడెను.

వారు సీతను వాల్మీకాశ్రమమునఁ జేర్చిరి. వాల్మీకులకు దానెవరిచరిత్రమును వ్రాసెనో యట్టిపవిత్రమూర్తినిఁ జూచినప్పుడుఁగలిగిన యానందమును సుకవులకే గోచరము. ఆమె నాతఁడాక్షణమునుండి యారాధించుచుండెను. అమ్మా! నీచరిత్రమంతయుఁ దెలియును. నీకు సుపుత్రులు గలుగవలసియున్నారు. వారురఘువంశమున కలంకారప్రాయులు. నీజన్మముసఫలమగును. ఆసుపుత్రులకు నావలన బ్రహ్మోపదేశము గలుగవలసియున్నది. వారివలన భారతవర్షము పవిత్రముగావలయును. ఇందులకే నీకీవాంఛగలిగినది. నాజన్మతరించుటకే నీవీరూపమున నాయాశ్రమము నలంకరించితివి. నీకిచ్చట సమస్తోపచారములు గలుగునని చెప్పెను. ఎండినస్రమాఁకునకు సకాలమందలి మేఘజలములువలె నీయమృతవాక్కులా దుఃఖితస్త్రకు మనశ్శాంతినిఁ గూర్చెను.

దినములు గడచుచుండెను. సీతాదేవి శుభముహూర్తమునఁగవలను బ్రసవించెను కెవ్వుకెవ్వున నేడ్చు శిశువులనుజూచి సంతోషపడఁదలంచునంతలో శిశువులను జూచుటకు జనకుఁడు దగ్గరలేడను దలంపామెహృదయమును శోధించుచుండెను.

శిశువులకుఁ గుశ లవులని నామకరణము చేయఁబడెను, కాలము జఱిగినకొలఁది బాలకులు ప్రవర్ధమానులగుచుండిరి. తపోధికులు కవితాజనకులగు సకలధర్మప్రవచనులగువారు విద్యా

గురువులై యుండఁ గుశలవులకొకలోపముండునా. సీత పుత్త్రిల నుజూచి సంతోషపడునుగాని తండ్రిపెంపు అయోధ్యావాససౌఖ్యము లేదను కొఱతమాత్రము జ్ఞాపకమునకు వచ్చినప్పుడెల్ల హృదయశల్యమై మఱపురాక బాధించుచుండును.

వాల్మీకులిప్పుడు కుశలవులకుఁ దానురచించిన సీతాచరిత్రమగు రామాయణమును చెప్పుచున్నారు. సీతాలతాంగికుపఘ్నము శ్రీరాముఁడు. ఆకారణమున సీతాచరిత్రము రామాయణమైనది కాఁబోలు. ఇట్లగునాయని కుశలవులు తాతవాల్మీకి నడుగుచుండఁగా విని సీత పుత్త్రిలబుద్ధి వికసనమునకు సంబరపడుచుండెను.

ఒకనాఁడు వాల్మీకులు పాఠము చెప్పుచుండిరి. అయోధ్యలో శ్రీరాములశ్వమేధయాగమును జేయఁ దలపెట్టినారనియు వాల్మీకులవారచ్చటికివచ్చి యాశీర్వదింపవలయుననియు వార్తవచ్చెను. వాల్మీకులానందపడి కుశలవులతో మీరు చదువుచున్న రామాయణమునకుఁ గథానాయకుఁడగు రఘురాముని జూచెదముగాక. రండని సీతాసమేతముగా వారందఱయోధ్యానగరము చేరిరి. లక్ష్మణకుమారుఁడు చంద్రకేతువు సకలాశాసంచారకుశలమగు నశ్వమునుదెచ్చి యజ్ఞశాలనుంచెను. నానావిషయాధీశులు కానుకలుగొని రామదర్శనార్థము వేచియుండిరి. రామరాజ్యము ప్రజలరాజ్యముగదా. సర్వప్రజలు తామేయశ్వమేధమును జేయుచుంటిమనుకొని యథాశక్తినందఱందు పాలుగొనుచుండిరి. ప్రతియింట నశ్వమేధమాయనునట్లు సమస్తగృహములు చూతపర్ణతోరణవిలసితములై వాదిత్రఘోషయుతములై మంగళగానవినోదములై యొప్పారుచుండెను. వనగుహాంతనదీతీరవాసస్థులగు ఋషిప్రవరులు వేదపాఠపవిత్రులగు బ్రాహ్మ

ణులు యజ్ఞశాలయం దుపవసించిరి. నిరతాన్నదానము. రాముఁ డెక్కడనున్నాఁడో గాని రామనామమెచ్చటబట్టిన నచ్చట భక్తి పురస్సరముగా గానము సల్పఁబడుచుండెను. వాల్మీకులు తేజో రాసులవలె మెఱసిపోవు కుశలవులు నూరియందచ్చటచ్చటఁ ద్రిప్పుచు రామాయణమును గానము చేయించుచుండెను. వేదచ్ఛందస్సుమాత్రమే యెఱుఁగినవారీ యపూర్వకవితామాధురికిఁగ ముగ్ధులైరి. ఆనోటనుండి యానోటఁబడి యది నసిష్ఠులు వినిరి. వసిష్ఠులయ్యది నింపుకొలువున శ్రీరామసన్నిధిని వాల్మీకాధిపత్యమున జదివింపదలంచెను. బాలకుల గానమాధురీప్రీతులై యెల్ల జనులొక్కుమ్మడి యుత్సాహపూరితులై యుండిరి. భరత శత్రుఘ్నులు, లక్ష్మణ, చంద్రకేతులు, కౌసల్యా, కైకేయీ, సుమిత్రులు రాజబంధువు లొక్కచోటఁ గూర్చుండిరి. ఋషిప్రవరులు పండితులొక్కదిక్కుననుండిరి. ప్రజలంతట నిండియుండిరి. వాల్మీకులకు నమస్కరించి కుశలవులు రామాయణమును జదువుట కనుజ్ఞ వేడుచు నేఘట్టమని గుర్వాజ్ఞకు వేచియుండిరి. ఎచ్చటనైనను సరియే యని వాల్మీకు లనుజ్ఞయిచ్చిరి.

కుశలవులు చదువుచున్నారు:—

శ్రీరామచంద్రులు పితృనానతిఁగొని వనవాసమునకుఁ బోవుచున్నారు. సీతాసతి యటవీవాసకష్టములనెంచక బ్రహ్మచర్యవ్రతమును బూని శ్రీరాములతో నరణ్యవాసమున కేఁగినది.

ఋషులీశ్లోకములు విని యార్యసతిగదా సీతయనిరి.

మఱల బాలకులు జదువుచున్నారు.

సీతాదేవి అశోకవనియందు నరమాంసఖాదనులగు దుష్టరాక్షసస్త్రీలమధ్యమునందుండి దుర్మార్గుఁడగు రావణుని బహువాక్యములకుఁ దృణముపైచి యాగడ్డిపోఁచతో నేమనుచున్నదనఁగా

ఓరీ! నేనుపతివ్రత నీకు కాలము మూడెనా! శ్రీరాముఁడు దైవము. ఆమహామహుని శరణువేఁడుకొని నీప్రాణములను రక్షించుకో నాకు ప్రాణముపై తీపిలేదు.

శ్రీరామకౌసల్యాదులీపల్కులు విని శోకించుచున్నారు.

ఇంకొకఘట్టము కుశలవులు చదువుచున్నారు.

దుష్టరావణుఁ డిల్లినాఁడు లోకము రక్షింపఁబడినది. దేవతలు తాపసులిఁక కుశలులు. ఆంజనేయాదులు విహరించుచున్నారు. ఇక్ష్వాకుకులు లేమనుచున్నారు సీత యొంటరిగా లంకలోనున్నది. ఆమె పాతివ్రత్య మప్రమేయని చాలుటకదిగో! అగ్నిశిఖలతో జ్వలించుచున్న కుండమనుచుండఁగా సీతాసతి గుప్పున దుమికి తప్తకాంచనమువలె వెలిఁగిపోవుచు మూర్తిఁదాల్చిన పాతివ్రత్యమోయన బయటకు వచ్చినది. ఈవాక్యములువిని ప్రజలలో గొందఱు సీత సతి ధర్మరక్షిణియనిరి. ఋషులు తాపసులు తలలూఁచిరి. శ్రీరామచంద్రుఁడు చింతాలగ్నుఁడాయెను.

వీరు చదువుచుండఁగా వీరివంకనే చూచుచున్న కౌసల్యాదేవి పేరెలుంగున నాబిడ్డల నిటు తోడ్కొనిరమ్ము. కాదేని నేనే వారియొద్దకుఁ బోయెదను. వారు మాజానకీరాములబిడ్డలు. సీతమ్మ. ఎట్టికష్టములపాలైతివి నాతల్లీ యనఁగానే ఇదివరకే వీరు రఘుకులజుని తలంచుచున్న లక్ష్మణుఁడు వారినిఁ దోడ్కొని పోయెను. శ్రీరామచంద్రుఁడు లజ్జచేఁ దలవంచుకొని పుత్త్రుల జూచి లోలోన సుఖదుఃఖముల యద్వైతభావముచే స్తబ్ధుఁడై శిలాప్రతిమవలె నిశ్చేష్టుఁడై యుండెను. వసిష్ఠులు సీతాసతీత్వమునుగూర్చి మహోపన్యాసము చేసెను. వాల్మీకులు సీతాపూతచారిత్రమునుగూర్చి యెంతయో చెప్పి రామునివంకఁదిరిగి సీతను బూతను బరిగ్రహింపుమనియెను. శ్రీరాముడింకను సుఖ

దుఃఖానుభవ పరిప్లుతిచే నేమియుఁ బలుకఁజాలకుండెను. ప్రజల లోఁగొందరు లేచి "సీతాసతి మహాపతివ్రత" యనిరి. ఎప్పుడు శ్రీరామచంద్రుని విశ్వాసము తనపైఁ బడునా యని క్షణమొకయు గముగా నిరీక్షించుచున్న సీతాసతినిఁజూచి వాల్మీకి అమ్మా ప్రజలందఱేకకంఠమున బల్కలేమ. నీవిప్పుడు ప్రత్యక్షముగా నీపాతివ్రత్యము నగ్నిముఖమున బ్రమాణించుకొనుమనఁగానే సీత నేలఁబడెను.

ఈదృశావస్థఁగని కుశలవులను బాలురు బావురని యే డ్చిరి. రామచంద్రుఁడు సింహాసనమునుండి భూమిపై వ్రాలెను. కౌసల్యాదేవియు, లక్ష్మణభరతాదులును దుఃఖపడిరి. క్షణము క్రింద సంతోషసాగరముగానున్న రామసభ యిప్పుడు క్షణము లో దుఃఖసముద్రమాయెను. శ్రీరాముని లక్ష్మణుఁడు సేదదే ర్చెను. కౌసల్య సీత నాశ్వాసించెను. సీత లేచి శ్రీరాముని యందు దృష్టిపెట్టి "జననీ భూదేవీ! నేనే పతిపరాయణనేని, నన్ను నీలోఁ జేర్చుకొను" మనుచుండఁగా భూమి యిరుపాయ లయ్యెను. భూమినుండి 'నీవు పతివ్రతవు, అనన్యమనస్కవు, శ్రీరామభక్తవు.' అని భోరున శబ్దము వినఁబడియెను. సీత యందఱుచూచుచుండఁగా భూమిలో నదృశ్యయాయెను. అంద ఱేకకంఠమున "సీత మహాపతివ్రత" యని యుఁగలార్చిరి.

# లక్ష్మీ విలాసకంపెనీ, ప్రచురణములు.

| | |
|---|---|
| 1 కర్తృకర్మక్రియా బోధిని | 0—1—0 |
| 2 భాషాభాగప్రబోధిని | 0—1—0 |
| 3 సుమతిశతకము (అర్థము తాత్పర్యముతో) | 0—2—0 |
| 4 సుమతిశతకము | 0—1—0 |
| 5 దమయంతీ స్వయంవరము (అర్థముతో) | 0—3—0 |
| 6 ఎక్కములు, మానములు (నూతనపద్ధతి.) | 0—0—6 |
| 7 గణితప్రబోధిని | 0—1—0 |
| 8 తెనుగులెక్కలబుక్కు పెరుసులు,(లెక్కలున్న) | 0—2—0 |
| 9 బాలగణితము ఉదాహరణలతో సర్వాంగసుందరము, 1, 2 భాగములు | 0—3—0 |
| 10 ప్రౌఢగణితము ఉదాహరణవిలసితము, 1, 2 భాగములు | 0—3—0 |

ఈరెండు పుస్తకములు చదివినపక్షమున, సంస్కృతాంధ్రభాషలలోగల సమస్తోచ్చారణములు తప్పులేకుండ వ్రాయగలసమర్థత గలుగును. ఇది చిరపరిశ్రమమువలన గలిగిన సత్ఫలము.

| | |
|---|---|
| 11 నీతిశాస్త్రము, (ప్రతిపదార్థ తాత్పర్యయుక్తము) | 0—3—0 |
| 12 లోకజ్ఞానము-సోమపుగీతములు. | 0—2—0 |
| 13 మిరాభాయి. | 0—2—0 |
| 14 సీతాదేవి. | 0—2—0 |
| 15 కుమారి(నీతిపద్యములు) బాలికలకుపయుక్తము. | 0—2—0 |

చిరునామా:—లక్ష్మీవిలాస కంపెనీ,
ఏలూరు, కృష్ణాజిల్లా.